

# కథాగమనిక.



క్లుప్తే,—;

బూరెలగంపమీద జోర్లావడ్డాడు, అదృష్టవంతుడు.

సౌభాగ్యశాలి సవతిబిడ్డననొక్క తిప్పలుపెట్టింది. ఎన్నో అపవాదులువేసి, కొంపలోనుంచి తేవగొట్టేసి స్వంతకూతుర్ని అందలంమీది కెక్కించా మనుకుంది.

పైని దైవమున్నాడుగా—?

తీరుమారైంది.

స్వంతకూతురు పైకి చటాయించింది—పొట్టకూ, బట్టకూ, ఆసవతిబిడ్డే అసరా అయింది.

ర చ యి త.

## కోళ్ల పరిశ్రమ.

(165 పేజీల తెలుగు గ్రంథం.)

ఇందు 28 కోళ్ళజాతులయొక్క సాంప్రదాయ వివరణ కోళ్ళకువచ్చు 64 రకాల రోగనిదానము చికిత్స, సంవత్సరాల పర్యంతం కోడిగ్రుడ్లను చెడిపోకుండా నిల్వవేయడం వ్యాపార పద్ధతులు, కోళ్ళనుపెంచిన విదేశీయులవలె అధికలాభాలు పొందగలవు ఈక్రింది అడ్రస్‌కు 1 రూపాయి పంపవలయును.

పోస్టుచార్జిలేదు. వి. పి. పద్ధతిలేదు.

వి. వి. స్వామినాయుడు ఫ్రెంచియానాం. తూ॥ గో॥ జిల్లా.



'ఏమండోయ్!'

... ... ...

'ఇదుగో;'

... ... ...

'మాటాడరేం?' జవాబెలేదు,

'ఇలా చూడండి; నేను మీకంత విషంలాగుంటే వున్నాను, ఇలారాండి;' అని బంగారమ్మ పిలవగా, పిలవగా—;

'ఏంవిటాసోద?' అంటూ రుసరుసలాడేడు జోగయ్యశాస్త్రి.

'ఔను నామాటేసోద, నావూసే వ్యధ.'

'అబ్బోనువ్వు వ్యాకరణపండితుడి కూతురివి; మాటల కేంలోటు?'

'ఎందుకొచ్చిన పాండిత్యం; కూతురిగొంతు కోశాడిలా.'

'నాకు కట్టిపెట్టా?'

'ఔను'

'నీకేంలోటు?'

'లోటా; చెప్పకుంటేసిగ్గు; చాలుచాల్లెండి, మీప్రజ్ఞ.

'నీటికీమాటికీ యిదోటి నేర్చావు.'

ఔను; వున్నమాటంటే వులుకెక్కువ; అదుగో మొఖం అలా చిట్లించుకుంటారేం? నామాటంటేనే ధుమధుమ లాడతారు.'

'ఇలాకూర్చోండి చెవుతాను.'

'ఏమిటో చెప్పు;' అని జోగన్నశాస్త్రి తుంగచాపమీద కూచున్నాడు.

'మీఅమ్మాయి వేషాలేమీ బాగాలేవు.'

'అదేం చేసింది?'

'మనమ్మాయి మొగుణ్ణిచూచి అలావిరగ బడుతుందెందుకు?'

'సూర్యం మాఅమ్మాయి—కమలం మనమ్మాయాకి మాట లోనే తేలిపోయింది నీయార్ష్య.'

'పోనీ ఇంతకోపంయెందుకు? కమలం మాఅమ్మాయి అంటారా? అనండి.'

'పేగు వేరైనంతట్లో హృదయం వేరవ్వాలా? నిన్నది తల్లిలా చూచుకుంటూన్నపుడు. నువ్వు కూతురిలా చూచుకోరోదూ?'

'మీకుమాత్రం సహసబుద్ధేది? సూర్యాన్ని చూచినట్టు కమలాన్ని చూస్తూన్నారా?'

'సూర్యం మాఅమ్మాయి'

'కమలం మాఅమ్మాయా?'

ఔను.'

'ఇంకానయం, ఇదిమీకు పుట్టలేదనికూడా అంటారు,'

'నానోటితో అనాలా?'

'నోరుముయ్యండి యెవరైనావింటే నవ్విపోతారు.'

ఇంకోసారి నవ్వాలా? ఇదివరకే అయింది.'

'వూరంతా మీరే అర్చారనుకుంటాను.' పైవాళ్ళెవరైనా చూచారా యేస్పారా?'

'లోకమంతా కోడైకూసింది,' నాకళ్ళార చూచిందాకా నమ్మేనా? నమ్మినాగాని—;

చిన్నమెత్తు మాటైనా అన్నానానిన్ను?

'ఆనాటిమాటేనా, మీరు నన్నస్థమానూ డొక్కాపొడుస్తూంటేది?'

'కామామరి?'

'అంతరాత్రికాడ మనింట్లోకి పరాయిమగా డెందుకురావాలనేనా; మీవుక్రోశమంతే? వాడెవడో; యెందుకొచ్చాడో? దొంగో? ముచ్చో?...;

'పీటిల్లో వహాడూకాను.'

'పోనీ నాసరసుడనండి.' అని బంగారమ్మ గుడ్లురిమి అనగా—;

'సానికి సరసులుంటారు.'

'రంకుమొగుడనండి, నాదేమీపోదు.'

'నువ్వన్నిటికీ తెగించావు. నీకేం? ఫలానాశాస్త్రిల్లు పెళ్ళాం అని వేలెట్టి చూపుతాడు ప్రతీపాడగట్ట వెధవాను.'

'తుంటర్లేదో అనుకుంటారని భయస్తూన్నారా? మనకావరం చూ క్కైని వెధవలెన్ని పేలుకుంటే? ఇలాంటి తుంటరిమాటలు పాటించక విసీవిననట్లు తలవాల్చుకుని మీమానాన మీరు పోతూంటే; యేడిచి యేడ్చి వాళ్ళే వూరుకుంటారు.'

'అంతకన్నా నేచేసేదేమిటి?'

'నేనేం చేస్తున్నానో చూచారా? కలిగినకాడికి పునిస్త్రీపుణ్యా మాంటూ మీక్షేమంకోరి శాస్త్రపరిశుభ్రంగా మొహం కడుక్కుని బొట్టూ కాటుకా పెట్టుకుని వీధిలోని యేపేరంటకానికో వెళ్ళేనంటే; మగాళ్ళమాటకేం; అందమైన ఆడదాన్ని చూడగానె, యెటువంటివా డికీ, అదోరకమైన దృష్టిచాపల్యంవచ్చి తీరుతుంది; వాళ్ళకేం విషంపె ట్టానోగాని, ఆముండలందరూ, కొంటెగా నవ్వుకుంటూ గుసగుసలాడు కుంటారు: అలాంటివి నేను లెక్కచేస్తున్నానా?'

'ఆనవ్వులూ—గుసగుసల్లోనేవుంది యెంతఅర్థమైనాను.'

'పోనీ; నాకేంపోయింది; వాళ్ళంతా నామీద బలాదూరు. నేను కాస్త అందంగా నుంటానని ఈవూరి ఆడవాళ్ళకూడా నేనంటే అసూ యతే; అంతేగాని నోరెత్తి యేమాటైనా వాగేరంటే చెప్పుతీసుకు పళ్లు రాలకొట్టెయ్యేనూ?'

'నువ్వెంత ధీమాగానైనా సమర్థించుకుంటావు. అవమానంఅంటే లవలేశమైనా భరించుకోలేని బేలగుండెవాణ్ణవడంచేత, అలా అహో రిస్తాను. నువ్వన్నదే నిజం;-' దొంగతనంతప్పు—పావం-ఘోరం; అని దొంగాడెరుగును. కాని-; వాడావని మానాడా? పైగా పైపెచ్చు. యెం తమందంటే తనను దొంగాడనుకోనీ; లజ్జపడతాడా? అలానే; తప్పని తేలీనివాళ్ళకు మప్పొచ్చుగాని-; తెలిసినవాళ్ళకు చెప్పలేరు. పైగా—;

తాము తప్పుచేస్తున్నాగాని, పైవాళ్ళకేంబట్టింది వెక్కిరించడానికి

చెప్పుకోడానికి అని మరింత గింజుకుంటారు, ఇది సామాన్యమనుష్యుల సహజ లక్షణం.' అన్నాడు;

'సరేగదా? ఇహ మనస్సొట్టే పాడుచేసుకోక నోరుమూసుకోండి.'

'మూసుకోకేం జేస్తూన్నాను?'

'మాటిమాటికీ ఈవూసెత్తు కోకండు మరి.'

'మాటొచ్చింది కాబట్టి—;' లేకపోతే నేనెప్పుడైనా?'

'నూర్యాన్ని తగిన అదుపుల్లో పెట్టాలి లేకపోతే కొంపమునుగుతుంది'

'ఆకసుగాయ ననుకోడ మెందుకు? అభమాశుభమా? దానికేం తెలుసు'

'మీకూ తెలీదుపాపం, కసుగాయా? వక్యానికొచ్చిన దోరకాయ యే మగాడికి నోరూరించదు?'

'వాడిపాపాన వాడే పోతాడు.'

'ఈవేదాంతం కట్టిపెట్టండి. ఔనుమరి, ఆపనిగూడ జరిగాక, నెత్తీ నోరూ కొట్టుకుంటే యేలాభం?'

'దానికలాంటి పాడుగుణాలబ్బవు, మానమర్యాదలు కాపాడుకోటం విషయంలో కేవలం దానితల్లిని మరిపిస్తుంది. యేంబుద్ధి—యేమి తెలివి;'

ఔను; యెవరినోటికందు, వాళ్ళకిందు, పిల్లి కళ్ళుమూసుకుని పాలు తాగుతూ, పైవాళ్ళెవరూ తన్ను చూళ్ళేదనుకుంటుందిట కదూ?

'ఏం కనిపెట్టావు నువ్వు.'

మొన్న పండక్కి కమలంమొగుడు మనుగుడుపు కొచ్చినపుడు. వాణ్ణిచూచి యిదెన్నెన్ని తమాషాలు చేసిందో మీరేమెరుగుదురు?

'ఏంచేసిందో చెప్పు.'

'అతడిక్కడున్నన్నాళ్ళూ దీనికి పట్టపగ్గాలున్నాయా? మొగుడు వచ్చినముండను గదాయని, గోమూల కూచుండిదా యేమన్నానా? దానిముస్తాబూ, వెకిలినవ్వూ, విరగబాటూను; ఆనాలుగు నాళ్ళూ భూమ్మీద సరిగా నిలబడిందా?'

'అంతేనా? కుర్రతనంగనక విచారమేవిటో యెరక్క.'

'అబ్బబ్బా కుఃర్రతనమా? దానస్తంవచ్చినట్టు సాగనిస్తే యీ పాటికిద్దరు కుర్రాళ్ళను కనేయిూవుంది. ఇకమాట దక్కదు వేగిరం ఆజుస్తు శాస్త్రా.........;'

'హరిహరీ!' అని జోగన్నశాస్త్రి రెండుచెంపలూ మూసుకోగా-;

'సరేలేండి; పాన్ని చేసుకోండి, నాకేం పోయింది? ఈపాడు ముండ సావాసంతో నాచంటిదానికేం ప్రమాదం వస్తుందోననేగాని, లేకపోతే నాకేం?'

'ముద్దులకూతురూ మీరూ యేగంగలో దిగుతారో దిగండి;' అంటూ రుసరుస లాడుతూ బంగారమ్మ లేచ్చక్కాపోయింది.

నాలుక అడ్డంగా కరచుకుని, ముక్కుమీద వేలెట్టుకొని, తెల్లబోయి చూడసాగాడు జోగన్నశాస్త్రి-

---

౨

సూర్యకాంతం జోగన్నశాస్త్రిగారి మొదటిభార్య కూతురు. భర్తతో పీటలమీదకూచుని, అల్లుడికి కాళ్ళుకడిగి, కన్యాదానఫలం సంపాయించిన సంవత్సరంజాటకుండానె పార్వతమ్మ పరలోకానికి వెళ్లగా బంగారమ్మను రెండోపెళ్ళి చేసుకున్నాడు శాస్త్రి

పెళ్ళినాటికె పెన్నుముదిరిన వయసులో నున్నందున వెంటనే వ్యక్తురాలై కాపరానికొచ్చింది. ఈమెఅంత లెక్కలోని అందగత్తె కాకపోయినా, పద్నాలుగేళ్ళ పాలపొంగు దశలోనున్న బంగారమ్మ శరీర పొంకంమాత్రం నేర్పరియైన శిల్పకారునివల్ల తయారుకాబడ్డ తీర్చిదిద్దిన పోతవిగ్రహంలాగ పడుచుకారుకుర్రకుంకలకు ఆకర్షణీయంగానె వుంటుంది

పెళ్ళికాలానికె జోగన్నశాస్త్రికి చత్వారపరివేశమైంది, అనగా నలభయ్యోపడి దాటిందన్నమాట.

ఆమెకోకూతురు పుట్టడం—పెళ్ళిఅవడమె కాకుండా కమలావతికి పదోయేడు యీడుకూడ వచ్చింది.

ఇప్పటికి పాతికేళ్ళు పైబడ్డ ప్రౌఢయైంది బంగారమ్మ,

మునలిమగని శక్తి సామర్థ్యాలమీద పూర్తిగా అసంతృప్తినొందిన బంగారమ్మయొక్క నడవడిక; ఇంట్లోవాళ్ళకీ, వీధిలోవాళ్ళకీ, బాగా వెల్లడయేట్టు ఆరోజుల్లో కొంత తెగింపుగానె నడిచింది గాని—,

'ప్రసూతాంతాని యౌవ్వనం' అనే శారిరక మర్యాద ననుసరించో;

వియ్యాలం దేనుకూడనూ, శాస్త్రజాగ్రితగా నుండాలన్న సాంఘికమర్యాదను పాటించో;

ఆ పెకిలి నడకయొక్క మూకుమ్మాత్రం తగ్గించింది చాలమట్టుకు;

జోగన్న శాస్త్రి మంచి నీమనిష్టలుగల అయితాగ్ని హోత్రి అవడంచేత, కళ్ళారాచూచిన పెళ్ళాంయొక్క అవమానకర నడవడికకు చాల యేవగించుకున్నాడేగాని, కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుందన్నట్టు చేసేదేమీ లేక తనలో దానె తల్లడిల్లుతూ. మనసు రాయి చేసుకున్నాడు; మునలెరికంలో, పడుచుపెళ్ళాం మూలంగా దాపరించిన యీదుఃఖంతోనె కుళ్ళుతూండే శాస్త్రికి పిల్లలపిడుగల్లే మరోయాపద కూడ దాపరించింది.

మొదటిపెళ్ళాంకూతురైన సూర్యకాంతానికి గర్భాదానమైన ఆర్నెల్లల్లోనె మగడు కలరావ్యాధికి బలైపోయినందున అబిడ్డభారం కూడా తనమీదే పడగా, శాస్త్రియొక్క దుఃఖం మరింత హెచ్చరిల్లింది;

తన కమలావతికంటే సూర్యకాంతం అందంగా వుండడమె బంగారమ్మ కళ్ళల్లోకారం జల్లినట్టయింది. అందుచేత యేదోవిధంగా సవితి కూతుర్నీ, మునలిమొగుణ్ణీ ఆడిపోస్తూనే వుండేది.

తనసంసారానికి ఆదిశక్తి హోదాలోవున్న పెళ్ళాన్ని మందలించుకోలేక—; తల్లిచావు కూతుర్ని పెట్టేహింసలకూ, తన్ను వెతిరేకించి చెప్పే జవాబులకూ, తాళుకోలేక; మధ్యనుబడి మాడిపోసాగేడు శాస్త్రి

తానూ, తనబిడ్డా యెల్లప్పుడూ కడిగిన ముత్యాల్లాగ ముస్తాబై కూచోడమున్నూ అంట్లుతోమే దగ్గిరనుండ, అన్నాలువండి వడ్డించేవర

కూావుండే, యింటెడు చాకిరీని, సవతికూతురు మీాదకు తోసేసింది బం గారమ్మ. ఏజన్మాన్ని చేసుకున్న పాపభారమో, ఈజన్మలో వైధవ్య రూపంగా మోయాల్సివచ్చిన సూర్యానికి, ఇంటిచాకిరీ భారంకూడా నెత్తిని బడ్డందున అదీ, యిదీ. మోయ లేక ఆసుకుమారియొక్క సుఖ మనేదే శుద్ధమంగళమై పోయింది.

పండు తమలపాకులాంటి బిడ్డయొక్క శరీరం యిలావంటింటో పొగచూాపి పోతుంటే, చూాల్లేక శాస్త్రి కంటతడి పెట్టని ఘడియే లేదు.

ఆమెకష్టాలకు పశ్చాత్తాపంతో గోదార్పు చెబుదామన్నాగాని, గం గానమ్మలాటి బంగారమ్మ నోటికిజడిచి, తనలోదానే తల్లడిల్లేవాడు శాస్త్రి

కూతురూ తానూ మున్నాళ్ళ, బంగారమ్మ పొరిగింటికి పేరంట కానికి వెళ్ళగా, అదేసమయ మనుకున్న శాస్త్రి. కూతుర్ని చూచి—;

'అయ్యో! తల్లీ యెంతనలిగి పోతున్నావే;' అంటూ కన్నీల్లొడ్చగా-;

'అదేంనాన్నా విచారించకండి.' అంది సూర్యకాంత.

'నీకర్మ చూాళ్ళేనే తల్లీ'

'నా కేంకర్మండీ; సంసార్గం కాదూ?'

'అయితేనో; నీకు కాస్త సాయమైనా చేయదుగదా? అంతా నీ నెత్తిమీాదే పోవాలా?'

'పోనిస్తురూ; అమ్మపెద్దది—చెల్లి చిన్నది; వీరిద్దరూ కూచుని తినదగ్గవారేగా?'

'ఇకనీ కేం సమాధానం చెప్పనే వెర్రితల్లీ;'

'నా కేమీా కష్టంలేదు నాన్నా, యిలాంటి వింకోపదింతలు పను లన్నా చేస్తే కలగనివిచారం, మీాకన్నీళ్ళుచూస్తే యెంతదుఃఖమైనావచ్చి బాధపడతాను నాన్నా.'

అంది సూర్యం తనచెమ్మగిల్లిన విశాలనేత్రాల్తో జేలగాచూస్తూ.

'తల్లిగొంతుగ్గోసి నందుకు, నువ్వు సుఖంగా—;'

అని బావురుమన్నాడు శాస్త్రి.

'ఇన్నాళ్ళే నన్ను చంపుకుతిన్నట్టే నాన్నా; మీకునేను చెప్పేదాన్నా?'
అంటూ తండ్రిని కావలించుకుని వెక్కి-వెక్కి యేడవసాగింది,సూర్యం;

శాస్త్రి దుఃఖంకూడ హెచ్చయింది. యిద్దరూ దుఃఖోద్రేకంతో నోరు మెదపలేక అలానే శోకాన్ని దిగమింగ ప్రయత్నం చేశారు బలవంతంగా. ఇంతలో పేరంటానికెళ్ళిన బంగారమ్మ వస్తూన్నట్టు చప్పుడు కాగా;—అదిరిపడి లేచివెళ్ళిపోయాడు శాస్త్రి;

సూర్యకాంతం వంటింటోకి నడ్చుకుంది.

---

౨

'నాయింట్లో ఇహపనికిరాదు.'

'ఎక్కడికి పోతుంది?'

అన్నాడు బంగారమ్మకు జవాబుగా జోగన్నశాస్త్రి చిరాగ్గా;

'ఎక్కడికా? వల్లకాట్లోకి.'

'హరిహరీ.'

'లేదా జుట్టుతీయించినా సరే;'

'నీకెందుకే కట్టుకతెందుకు బంగారం?'

'అదంతా నాకు తెలీదు.'

'ఆడపిల్ల మొగుడితో పోవాలి; లేక—;'

'మొగుడి దగ్గరకే!—'

'వాడిలాగ చావమన్నావా?'

'ఏమో; చస్తుందో ముతమారుతుందో?'

'భాగుబాగు.'

'బాగోవోగో; చెప్పాసుగదా?'

బంగారం! నువ్వలాకిష్టపడితే యెలా? అత్తారిల్లు అడివైపోనే పోయింది. దానితల్లిగనక బతికుంటే కడుపులోపెట్టుకోదూ? నేనింకా బతికుండికూడా, దాన్నెలా హింసపెట్టను?

'మీరి నేమాట బావుంది. జానితల్లిలాగ నన్నుకూడ చానమం టున్నారా? అలాగే; మీయిద్దరికళ్లూ చల్లబడేలాగు నేనే పోతాన్లెండి'

అంటూ బంగారమ్మ వెక్కి-వెక్కి యేడ్వసాగింది పైటచెంగు ముఖంమీద కప్పుకుని;

'దాన్నెక్కడికి పొమ్మనేది?'

'ఎక్కడికీవద్దు, మంగలాణ్ని పిలిపించి—;'

'వచ్చే మాఘమాసంలో;'

'అబ్బో! ఇంకాపది నెలలుందే?'

'అంతేగా?'

'మీకంత నిరసనగానుంది. నామట్టుకు, నిముషమో యుగంలాగుంది మీకూ మీయమ్మాయికీ సిగ్గూ,లజ్జలేవు ఈవల శిష్టాచారవంతుల్తో వియ్యమందాను కూడను. మాపుట్టింటి ఆచారాలు మీ రెరగందిగాదు.'

'అభమూ శుభమూ యెరగని కసుగాయ. దానికింకా కొన్ని సరదాలైనా తీర లేదుగదా; మొగుడు సంగ తెలావున్నా దానికింకా తల్లి తాలూకు దుఃఖమైనా చల్లార్లేదు. ఇంతలోనె హడలబెట్టగూడదు. నేను మాత్రం బాధ్యుణ్ణిగానా?'

'సరే; దానిసరదాలన్నీ తీర్చుకునేటప్పటికి మనదురదకూడ తీరు తుంది. మీరైతే అమ్మాయికి అన్ని సరదాలూ తీరుద్దామనుంది కాని-'

'నేనుమాత్రం వూరుకునేది లేదు. మంగలిసోముల్ని రేపేపిలిచి, ఆకా స్తతరవాయీ తీర్చేస్తానుండండి. దాన్తోగాని మీతండ్రీ కూతుళ్ళ సరదాతో వళ్ళుతిమ్మెరకూడా వొదుల్తుంది.'

అని రుసరుసలాడుతూ, బంగారమ్మ లేచి వెళ్ళిపోయింది.

'శ్రీరామచంద్రా! నాసంసారాని కెన్నెన్ని తిప్పలొచ్చాయి;

వయసు ముదిరినవాడికి పడుచుపెళ్ళా మేమిటని లోకులంతా ఆడి పోస్తున్నా తోసేసి, యీదండుముండను మెడకు తగిలించు కున్నందుకు అనుభవించొద్దూ? ఈరాక్షసి అనుకున్నంతపనీ చేసితీరుతుంది.సందేహం

లేదు. అందుకు తగిన యెత్తెత్తి సూర్యాన్నాయాపదనుంచి తప్పించాలి-

కాస్తవయసు ముదిరితే అందే అంగీకరిస్తుందిగాని, ఈబాల్యావస్థలో బలాత్కారంగా అలాంటివని చేశామంటే, హడలి చచ్చిపోదూ?

నెలరోజుల్లో మూర్తంపెట్టి 'రేపు' అనే ముక్కను మరిపిస్తాను. ఈలోపున రాజమండ్రీ వెళ్ళి, చెల్లితో మాట్లాడి, సూర్యాన్ని యాపద నుంచి తప్పించేమాత్రం ఆలోచిస్తాను. సుభద్ర చాల తెలివైంది. కుర్రాడు రంగారావుకు రివిన్యూ యినస్పెక్టరుద్యోగం అయాక వెళ్ళిచూళ్ళేదు. తల్లీబిడ్డల్ని పలకరించినట్టూ వుంటుంది, ఈరాకాసికి తగిన బుద్ధిచెప్పే ఆలోచన సంపాయించినట్టూ అవుతుంది. అందుకు రేపే బైల్దేరి రాజమండ్రీ వెళ్ళివస్తా.

శ్లో॥ 'సోమేశ నిర్దక్షిణ మర్థలాభం'

అన్నారు కాబట్టి దక్షిణానికి రేపు దశమీ సోమవారం దివ్యంగావుంది.

సూర్యాన్నికి వాళ్ళరంగారావుకి పెళ్ళిచెయ్యమని కాళ్ళావేళ్ళాబడి, కావలసినంత గోలపెట్టింది చెల్లాయి సుభద్ర.

లేనిసంసారమని నేనే వెనకతీసి, దీంవుసరంతా కట్టుకున్నాను. పడినగోడలు పడ్డట్టేవుంటాయా? లేనిసంసారాలు తలెత్తడం—ఉన్న సంసారాలు వుల్టాసీదా అవడమూ నా జీవితంలో యెన్నిచూచానుగాను?

కుర్రాడు తెలివిగా చదువుకుంటూన్నాడు; వాళ్ళకూడూ గుడ్డకూ తగినవుద్యోగం సంపాయించుకోలేడా; అనుకున్నానుగాని, నన్నుమెడలు విరిచి, తనకు దగ్గిరసమ్మంధ మంటూ, రోగిష్టిపీనుక్కి కట్టిపెట్టించింది దానితల్లి. ఇంతకూ సూర్యంనెత్తిరాత యిలావుండగా, చెల్లెలితో వియ్యామందేభాగ్యం యెలాకలుగుతుంది నాకు?

రంగడిభాగ్యాని కేంలోటూ? రివిన్యూ యినస్పెక్టరుద్యోగం చేస్తున్నాడుగదా; క్రమంగా డిప్టీకలక్టరుకూడా అవుతాడు. అలాంటి యోగం దీనికి లేందేనా? వాడింకా పెళ్ళాల్లేదు. ఏయదృష్టవంతురాలికి మగడౌతాడో; దురదృష్టవంతుణ్ని నేనుగనక విడిచుకున్నాను.

కాని. ఇప్పుడు వాడున్నస్థితికి, జమీందారీ సమ్మందాలే వచ్చిపడతాయి కాళ్ళమీద. వాడికేంలోటు?

'అని గతజలసేతు బంధనంవలె' వెనకటి తన తెలివితక్కువను తలపోసుకుని, రాజమండ్రీకి ప్రయాణం కట్టాడు జోగన్నశాస్త్రి.

---

## ౪

'సూర్యం కులాసాగానుందా అన్నయ్యా?' అని శుభద్రమ్మ అడగ్గా;

'ఆఁ! ఆరోగ్యంగానేవుంది.' అన్నాడు జోగన్న.

'వదినదాన్ని బాగాచూస్తుందా?'

'సవతల్లి ప్రేమగా...'

'పాపం దానిరాతలా బద్దలైంది.'

'న్యాయం కృతాపరాధం'

'ఏమిటో అన్నయ్యా! మన మలానుకుంటాంకాని; భగవన్నిర్మాణాని కెవరు మార్పుచేయగలరు? మంచైనా చెడ్డయినా జరిగిపోయాక అనుకుంటాం; మంచిజరిగితే తనప్రజ్ఞఅనీ—; చెడ్డజరిగితే—; దైవసంఘటననీ అనుకోడం మనుషులకు అలవాటేగదా అన్నయ్యా!'

'నిజమేగాని చెల్లాయ్, ముందు జరగబోయే ఘటన ననుసరించి మనసుకూడ మారిపోతుంది.'

'అదే భగవంతునిశక్తి, అంతా దాంట్లోనేవుంది. మనమే పొరబడుతుంటాం.—చంటిది కమలం బావుందా?'

'దానికేంలోటూ? కలిగిన సంసారం పైగాతల్లి సంరక్షణలోనుంది.'

'ఔను నిజమే;'

ఏనుగంత తండ్రికంటే—; యేకులబుట్టంత తల్లి మేలంటారు.

'అక్షరాలాసత్యం; నేనెంత గారంగా చూస్తేనేం? తల్లిలేనిలోటు సూర్యం యెంతనుభవిస్తూందో చూడ్డంలేదూ నేను?'— — ——

'అందులోనూ, స్వంతకూతురుగల తల్లికి సవతికూతురిమీద

ప్రేమ అన లేవుండదు. అది లోకపరిపాటే;'

'ఔను చెల్లాయ్! కడుపులో ప్రేమ లేకపోడం సహజమే,'

'ఇంకో అడుగు ముందుకే వేసింది గాబోల్ను మావదినె.'

'ఒకడుగా; నీమొహం! పదడుగు వేసింది ముందుకు.'

'తిట్లూ దెబ్బలూ కూడా మొదలెట్టిం దేమిటన్నయ్యా!'

'అదైతే నయమే;'

'ఇంకా యేంజేస్తుంది?'

'చెప్పాలంటే సిగ్గేస్తుందమ్మా; నాకు నోరుకూడ రావడంలేదు. ఆమె నీచస్వభావం వెల్లడించడానికి.'

'ఊటూరు గయ్యాళిగంపలు ప్రపంచంమీద. అదంతా నీగ్రహపాటు; ఈశ్వరుడు తినడానికి నోటికు ప్రసాదం పెట్టినందుకు; పెద్దవదినె పార్వతమ్మ పదికాలాలపాటు బతకొస్తూ; ఆమె నిజంగా పార్వతే;

'నెమ్మదిగా అంటావూ? దురదృష్టవంతుడుకి అంతమంచి గృహిణి యెలాదక్కుతుంది నీవెర్రిగాని;'

'పోనీ అన్నయ్యా! ఆమెకు కాలం తీరిపోయింది. ఈవిడ బిడ్డల్నీ మిమ్మల్నీ ఆదరంగా చూడకూడదమా?'

'ఆయిల్లాలు పోయిన విచారంకంటె, ఈగయ్యాళి దాపరించిన యేడుపెక్కువైది నాకు. ఇంతకీ, నీతిమంతురాలైతే చెప్పకండి.'

'వంచెప్పను చెల్లాయ్;' అంటూ శాస్త్రి బేలగా చూడగా—;

'ఛీ ఛీ! అదికూడ అనుమానమేనా?'

'అనుమానమైతే నయమే;'

'ప్రత్యక్షంకూడనా?'

'నాకేగాదు. లోకానికంతకూ, టముటమాయే;'

'శివశివా! అంతమట్టుకొచ్చిందా? నాన్నయైన భగీరథశాస్త్రులు గారి కీర్తికి నేటికిలాంటి నీచపుకోడలు దొరికిందా?'

'ఆదేనేను మొత్తుకునేది. నన్ను వేపించుకుని తినేది. సరేసరి; పాపం

పూర్వాన్ని నానాకారుకూతలతో ఆడిపోయడం మొదలెట్టింది.

'పైగా—, దానినడవడిక చెడిపోయిందటూ పాపపుబండి తోల డానికూడ వెనకాముందూ చూళ్ళేదు.'

'శివశివా!' అంటూ చెవులుమూసుకుంది సుభద్రమ్మ.

ఇంకా యేమడిగావు; ఇదంతా వకందుకొచ్చిం దనుకుంటాను. తనస్వంతకూతురైన కమలానికంటే, సవతికూతు రందంగా నుండనేల?

అనేకదుష్టబ్బు అనేకరకాలగా తీర్చుకోడానికి మొదలెట్టింది.

'బాగుబాగు.' అంటూ ముక్కుమీద వేలుపెట్టుకుంది సుభద్రమ్మ.

'అందుకేలాగైనా దానికి 'వపనకర్మ' చేయించేసి, వీధ్భావిట్లో కైనా రానీక, వంటింట్లోనే మాడిచేదామని దానితలంపు

'పాపం కసుగాయ; దానికే౦ తెలుసు? తిడితే పడుతుంది-కొడితే యేడుస్తుంది. దానికింకా వాలుజట ముచ్చటైనా తీర్లేదు.'

'అజడ చూచినప్పుడల్లా యీగయ్యాళి మనింతకళ్ళల్లో కారం జల్లుకోసాగింది సవతికూతురు జడముందర స్వంతకూతురిది మొలకతోక [illegible]. అనో కొంతేడుపు.'

'దానికళ్ళునీళ్ళే పోతాయి. యెవరందం యెవరికొస్తుంది; ఆమె పాపబుద్ధిగాని;' 'అంచేత ఆకుర్రదాని జుత్తైలాగైనా తెగ్గొరిగించేసి బోడిముండను చేదామని;' 'అంతమాత్రంలో తనకూతురి అందం యెక్కువై యెలకతోక యెదుగుతుందాగా?'

'తనకూతురిజడ యెదగకపోయినాసరే; సవతికూతురికి బోడి తల కావాలి.' అన్నాడు జోగన్నశాస్త్రి

'పాపం; మొగుడేవిటో; చావడమేమిటో యెరగని కుర్రదాని కా యీబెడదకి?'

'అలానేవుంది. చెల్లాయీ;'

'మరిపోరెలా చల్లార్చు కుంటారు?'

'అదేనిన్ను సలహాచేదామని వచ్చాను. మంగలాణ్ని పిలిపించి

ఆకాస్త తరవాయీ తీర్చేదామని చూచిందిగాని; నీసలహా తెలుసుకుంటే మంచిదని, నెల్లాళ్ళు వాయిదాపెట్టి యిలా చక్కా వచ్చాను.'

'మంచిపనిచేశావు. పోనీ అన్నయ్యా నీబిడ్డాహాటీ నాబిడ్డాటీనా; ఇక్కడికి పంపెయ్యరాదూ సూర్యాన్ని?'

'పంపెయ్యమన్నావా? నాకూ అదేతోస్తుంది. అలాగైతే దాని కడుపుకు తీరుతుందేమో?'

'తప్పకుండాను; ఈవృద్ధాప్యంలో మీకు గృహచ్ఛిద్ర విచారములూ లేకుండా సుఖించనైనా సుఖిస్తారు' అని సుభద్రమ్మ అనగా;

అలానే పంపేస్తాను. అన్నాడు జోగన్నశాస్త్రి.

---

౫

'హాసేవ్! దరిద్రగొట్టా! పడమటింట్లోపాచి అలానేనా? పిచ్చావిట్లోదమ్మ ఇలానేనా తుడవడం? నువ్వొక్కడ దాపరించావే శనిముండా. అంటతెప్పేలాలు తోమసివదలేశేదు; మొన్ననేకొన్నాను సీమవెండి తప్పేలా కోరుకొండతీర్థంలో, నెల్లాళ్ళన్నా అవలేదు పచ్చడి బద్దలా ముల్లాగ అరగతోమేసింది; నీమొహమిచ్చా అలాచూస్తావేం మొఖమంత కళ్ళుచేసుకు?

నాకు చెడిపిగానీ పెడతావాయేమిటి; నీచూపుమండా;

అదుగో; అవేనేర్చావు మాటాడకపోడమే మందనుకున్నావా? అదోటి నేర్చావు. బుడిబుడి దుఃఖాలు. మాటంటే యేడుపు— పని చెబితే పాడూ భగ్గమూను. చాయలో వుప్పెక్కువేశావేం;

అంటే—; మన్నాడు చప్పిడిచారే తగలేస్తావు నా మొహంమీద.

పప్పు అలామాడ్చేసి కాటోబెట్టావేం; అంటే—;

ఇంకోనాడు బద్దలకుబద్దలే వుడక్కుండా పారేస్తావు.

చంటిదానికి తలదువ్వితోన్ని వేడినీళ్ళుకాచి, వళ్ళుతోమి స్నానం యేనాడైనా చేయించావా? యేవేళచూచినా నువ్వు ముస్తాబూ, నీస్నా

నమూనాగాని; వెధవముండ కీవేషాలేమిటి? సానివౌదామనుంది కాబోలు; అవనేలఅయ్యావు. నీవేషాలూ-నీవగలూ- నేనెరగ ననుకుంటూన్నావా?

అదుగో అలాసణుక్కుంటే యేం తెలుస్తుంది? వగలేమవు లక్షణమే అది. కన్నీళ్ళు రాలకపోయినా, పైటచెంగు చాటుచేసుకుని; ఎంతో వెక్కిలింత యేప్పులాగు వులిక్కివడ్డం యెవరికీ జాలివేయదు.

పెంకితనం-మంకుతనం-రంకుతనం-అన్నీ తోసుకుపోతాయనేగా;

మాటాడితే బావురుమని అరవడం? ఆఖరికిలా మొండికెత్తావు?

మాట మీదపడేసరికల్లా యెగిరిచక్కాబోయి తండ్రితో గుడగుళ్ళాడుతూ, వున్నవీ లేనివీ, చిలవలూ, పలవలూపన్ని చెవులోవూది వస్తావు. నువ్వొంటో అందగత్తెవని, చంటిదాన్ని వెక్కిరిస్తూంటావు;

యెన్నాళ్ళిలా వెక్కిరిస్తా చూస్తానుగా: ఆజుట్టుకాస్తా దిగ్గొరిగించేస్తే నేగాని నీపొగరూ—యెగిరిపాటూ, అణగవు.

చంటిదానికి వేళయింది, కాఫీతగలెయ్యి, కొయ్యబొమ్మలా అలా నిలబడ్డావేం! ఇహానాలించు కూనిరాగం.

అంటూ; నిమిషాని కైదువందమాటల హైస్పీడులో చెడామడా నోటికివచ్చినట్టల్లా, అనేసింది బంగారమ్మ సూర్యాకాంతాన్ని.

ఈసుగుణశీల, సవతితల్లియొక్క ఘూర్తలక్షణాల్ని బాగాయెరిగినదవడంచేత యెంతో అవసరమైతేనేగాని జవాబే చెప్పేదిగాదు.

'ఏం బెల్లంకొట్టిన రాయిలాగ మాటాడవు; కాఫీ అయిందా?' అని బంగారమ్మ గుడ్లురిమి అనగా—;

'బెల్లం లేదమ్మా.'

'అయ్యో, అపుడే అయిపోయిందా? మొన్ననేకదూ వంపుబెల్లం తెప్పించాను.'

'ఔను; ఈమూన్నాళ్లనుండీ, చెల్లికీ, నీకూ, రెండుపూటలూ కాఫీల్లోకీ, చెల్లి పెరుగన్నంలో నంజుకోడానికీ, సరిపోయిందమ్మా;'

'హోసీ దొంగరండా? నువుకూడా కాఫీతాగుతున్నావు కాబోల్ను;

లేకపోతే యిన్నాళ్ళకూడా సరిపోవాల్సిన బెల్లం; అప్పుడే?

'రామరామ! నేనెన్నడూ కాఫీముట్టుకోనమ్మా, చెల్లాయినడుగు;'

'బావ్రండి. చంటికుర్రదానికేం తెలుసు? నేనుచూస్తానా, చేస్తానా; కావలసినంత బెల్లం, పాలూ వేసుకుని చిక్కనిది, నువ్వుతాగింతర్వాతే ఇంకోయిన్ని వేన్నీళ్ళుకలిపి మాముఖాన పారబోస్తావు,' అందేగా!

'నారాయణ; అలాంటిమాట లనకమ్మా;'

'ఛీ: నోరుముయ్; నాకెదురు చెబుతావా భడవా?'

'నువ్వు తాక్కపోతే యేరంకు.........కన్నా చాటునీమాటునీ అందిస్తూన్నావేమొ; లేకపోతే బెల్లం అయిపోవడమేమిటి?

'రామరామా;' అని కన్నీళ్ళు కారుస్తూ రెండుచేతుల్తోనూ చెవులు మూసుకుంది సూర్యం.

ఛీ దరిద్రముండా; 'రామరామ' అని నీనోట్లోంచి రాకూడదే;

నోటినోమాల కొక్కింది అపాపం. ఈరభసంతావిని, జోగన్న శాస్త్రి అక్కడికి వచ్చేప్పటికీ;

తనమొహం తానేప్రిమాదకూడ వుండగలందులకై, ముఖం తుడిచేసుకుని, నోటిమూయెరగనట్లు నిలబడింది సూర్యకాంతం.

'నాకేం భయమనుకున్నావా? మానేశావేం! యింకావేసువ్వు.'

అని బంగారమ్మ గద్దించగా—;

'ఈరభసేమిటేమి?' అని జోగన్న శాస్త్రి అనగా—;

రభసాలేదు, రంధీలేదు. కాఫీలోకి బెల్లం అప్పుడేఅయిందా. అంటే

గంగాధరుడు నెత్తిమీదికెక్కాడు మీగారాలమ్మాయికి

'పాపందాన్నిం కెందుకేడిపిస్తావు?'

'నేనేడిపిస్తున్నానా? పైగా కూతురిని వెనకేసుకొచ్చి నన్నిలా ఆడిపోస్తారా?'

'కమల వచాటే, సూర్యం—;'

'కాను. ఎందుకొతుంది?'

'నేను నీకు మగణ్ణి అయితే; నాకూతురు నీకూతురే;'

'కాదు'

'నేను మగణ్ణికానా?'

'మీరెలా అనుకున్నా సరే;'

'అలాగైతే నాయావదాస్తీ, నాకూతురిదే;'

'అంతమట్టుకొచ్చిందేం; అదీ చూస్తాన్లే; మీకూతుర్దో మీదో; చుపిస్తాను తొందర పడకపోతేసరి.'

అంటూ ఛరాల్న లేచి వెళ్ళిపోయింది బంగారమ్మ.

---

౬

'నిక్షేపంలాటి పిల్లా యెలాఅయిపోయిందో అన్నయ్యా!' అని సుభద్ర జాలిగా అనగా—;

'ఏం చెయ్యను సవతల్లి......;'

అయ్యో, అయ్యో! మాణిక్యంలాంటి పిల్ల, బంగారపుబొమ్మ. ఇలా మాడ్చేశారు.

'దానిరాత బావుంటే—;'

'తల్లే బతుకునంటారా?'

'మగడూ గొంతుకోస్తాడా?'

'ఔను నిజమే అన్నయ్యా!'

అంటూ సూర్యాన్ని సందిట్లోకి తీసుకుని, తలనిమురుతూ, కన్నీళ్ళొత్తుకోసాగింది సుభద్రమ్మ.

'చెల్లాయ్! ఇవాళనాబిడ్డకాదు నీబిడ్డనుకో; సూర్యానికి నీకోడలై కాపరంచేసేయోగం లేకపోయినా—కూతురై కాపరానికి సాయపడుతుందనుకో చెల్లాయ్.

'అయ్యో! యెంతమాటన్నయ్యా; మానవజన్మయెత్తిం తర్వాత యిలాంటి ఆపత్తులు అనేకమందికి వస్తూనేవుంటాయి. కావలసిన వాళ్ళై

వరో వహారు కడుపులో పెట్టుకోకపోతే, ఇటువంటి అమాయిక— అనాథలగతేం కావలసింది. నేనొహాటికి నవ్వొకటీనా అన్నయ్యా? సూర్యానికేమీ పరవాలేదు. దీనినేవిధమైన చీకూచింతా లేకుండా పోషించేభారం నాది.'

'ఇహ భయంలేదు. నాతల్లి సుఖపడుతుంది.' అని శాస్త్రి అనగా-;

'మరేమీ త్రోవలేదన్నయ్యా; ఆగయ్యాళిది అడ్డమైనచాకిరీ, దీనిమీదకు నెట్టేసిందిగాబోలు, చూడు, లేతమామిడి చిగుళ్ళవంటి దీని చేతులెలా కాయలుగాచినవో, అంది సుభద్రమ్మ.

ఈసమయానికె రంగారావు క్యాంపునుండివచ్చి గుమ్మంలో బండిదిగి, పెరట్లోకి చక్కావచ్చి—, తల్లితో మాటలాడుతూన్న మేనమామ జోగన్నశాస్త్రినీ, సూర్యాన్నీ చూచాడు.

చిన్నప్పటి కొన్నియానవాళ్ళనుబట్టిన్నీ, మేనమామకూడ వుండడంచేతనూ, ఆమెయొక్క బాల్యవిధవా లంకారాలనుబట్టీ, సూర్యాన్ని వ్రూహించుకోగలిగిన రంగారావు కామెయాకారంలో, పరిపూర్ణ వికాసవంతమైన వింత యౌవనకళ గోచరించి ఛకితుడయ్యాడు.

'రంగా! చూచావు! ఈయమ్మాయి యెవరు చెప్పుకో,'

'వోస్! మేనమామా కూతుర్ని మరిచిపోతారా? యెవరైనా?'

'అన్నాడు కోటుతీసి పాగాబల్లకు తగిలిస్తూ రంగారావు.'

అతణ్ణి వోరకంటితో చూచి తృప్తిపడిన సూర్యకాంతం సిగ్గుతో, మేనత్త సుభద్రమ్మ చాటుకు జరిగింది.

'బావేకాదటే! అలాసిగ్గు పడతావేం?' అని సుభద్రమ్మ అనగా-;

'బీదబావే కమా?' అంటూ మెత్తిపొడిచాడు రంగారావు.

'తీరిందినాయనా భాగ్యం సరదా;' అని జోగన్నశాస్త్రి అనగా;

'బిడ్డకళ్ళలో సిరివుంది. మనమంతా వుండగా దానికేంలోటూ?'

'కూటికీ గుడ్డకీ లోటులేదుకాని—,'

'భగవంతుడు చేసినదానికి మనమేంచేస్తాం?'

'ఆఁ! భగవంతుడి కింకేంపనీ లేదుగాబోల్సు, పుస్తికట్టకం, పుణికెయ్యడం?' అన్నాడు రంగారావు నవ్వుతూ.

'రంగా! నీకెన్ని సార్లో చెప్పాను. దేవుడిమహిమను గురించి. వెటకారాలాడొద్దని చూచావా అన్నయ్యా! మాకిద్దరికీ రోజూ యిదేచర్చ.'

'ఈకాలం మనుష్యులంతేనమ్మా; ఈచదువులూ వీళ్ళూను.' అన్నాడు జోగన్నశాస్త్రి

రంగారావు సుభద్రమ్మ కొక్కడేకొడుకు, పితృగండాన్ని పుట్టేడో యేమొ; ఇతడుభూమిమ్మీదపడ్డ నెలదాటకుండానే తండ్రి దాటిపోయాడు.

నాలుగెకరాల భూమిమ్మీదవచ్చే సామాన్యాదాయంతో సుభద్రమ్మ సంసారంగోప్యంగా నడుపుకుంటూ, కుమారుణ్ణి బి.ఏ; ప్యాసుచేయించింది

రంగారావుకు స్వతహాగా కలిగిన తెలివితేటలకు తోడైన అదృష్టం ఫలించిందో యేమొ; చదువుచాలించిన సంవత్సరంలోనే, రివిన్యూయినస్పెక్ట రయ్యాడు.

వచ్చటి శరీరంమీద పనివాడితనంగా చెక్కిదిద్దబడ్డట్టిన్ని ఆయవయవాలు చూచినవాళ్ళకెంతో ముచ్చట గొలుపుతూంటాయి. నూనూగు మీసాలంకురిస్తూన్న ఇరవై రెండో సంవత్సరం వయసు.

కట్నాలూ, కానుకలూ, జోరుగా యిస్తామంటూ నాలుగైదు సమ్మంధాలు వచ్చినై గాని, తహసీల్దారీ అయ్యేవరకూ, పెళ్ళాడనని శపదంపట్టాడు, కేవలం మేనత్తకొడుకైనందుకు సూర్యకాంతాన్నే రంగారావుకుచేస్తే ఆబాలకీయవస్త కలక్కపోనుగాని——;

దైవఘటన యిలావున్నందున, బాధ్యతవహించిన, జోగన్నశాస్త్రికి భాగ్యవంతుడైన అల్లుడిమీద భ్రాంతి కలిగినందున, రంగారావు కింతవరకూ పెళ్ళి కాకపోవడమూ, సూర్యానికి పెళ్ళీపెడాకులూ తీరిపోడమూ జరిగింది.

సవితల్లి సాధింపు చల్లారిపోడమూ, మేనత్తచేసే యాదరమూ, సూర్యానికి నచ్చినందున, కొన్నాళ్ళక్కడనే వుండడానికి అభ్యంతరం

చెప్పనందున, కూతురిని చెల్లెలికి వప్పగించి జోగన్న శాస్త్రి గోకవరం వెళ్ళిపోయాడు. నిర్విచారంగా

---

౩

'సూర్యం!'

'ఆఁ!'

'బావేకనూ, సిగ్గుపడతావేం?'

తలవాల్చి ముసిముసినవ్వులు నవ్వుకుంది. సూర్యకాంతం.

'సిగ్గుపడకు తల్లీ;'

... ... ...

'పెద్దదానివైనావనా ఈసిగ్గు? చిన్నప్పుడు నిన్నెత్తుకు తిప్పేవాడేకనూ బావ?'

సూర్యంతలవాల్చి ఓరకంటిచూపులతోనె జవాబిచ్చింది మేనత్తకు.

ఆడపిల్లలు లేనందున ఇంతకాలానికి అన్నకూతురు తనింట్లోకి రాగానే సుభద్రమ్మ ఆనంద చుక్కల్లోని కెక్కింది.

ఈమెను రంగారావుకు చేసుకుందామని చాలాతంటాలు పడ్డది. దైవఘటన యిలావుండగా మరోలాగెలా అవుతుంది.

కేవలం కోడరికమే చేస్తే యెంతానందించేదోగాని, చుట్టంచూపుగా వచ్చిన సూర్యాన్నిచూచి పరమానంద భరితురాలై, యెంతో ఆనందంగానూ, ఆదరణతోనూ, చూడసాగింది. యేతల్లీకూడా, కూతురి నింత మమకారంగా చూచేవాళ్ళుండరు.

ఇలాచేత్తో చీపురుపట్టనివ్వదు. చాత్తో చాదెడునీళ్ళయినా తోడనివ్వదు. అన్నంపెట్టి తిన్నాకతరువాత కంచంకూడా కడిగేది సుభద్రమ్మ

రంగారావు యెన్నోపుస్తకాలు సంపాయించి పెట్టాడు బీరువాలో,

భోజనాలై తీరుబడిగాకూర్చున్నాక, పురాణమో, నాటకమో, నవలో తీసి సూర్యంచేత చదివించి వింటూండేది సుభద్రమ్మ సంతోషంతో

సుభద్రమ్మ మంచిజ్ఞాని; భారతభాగవతాలు అసర్గళంగా చదివి అర్థం చేసుకోగలంత చదువుకూడ వుంది.

సంగీతజ్ఞానం లేకపోయినా, పురాణకాలక్షేప శైలిలో యీమె పద్యాలుచదువుతూంటే, వినేవారికెంతో ఆనందంగానుండేది. భాగవతం లోని ప్రహ్లాద–గజేంద్ర; మొదలైన భక్తిరస ఘట్టాలు ఈమెశరీరం మరిచి గొంతెత్తి చదువుతూన్నపుడు గనకవింటే; యెలాంటి పాషండునికైనా బుద్ధిమారి, భక్తిలో పడతాడు.

ఈకాలపు నవలలంటే; సుభద్రమ్మకు తలనొప్పి, కాని, మేనగోడలు సూర్యానికి ఆనందం కలిగించడానికే యేదైతేనేం? అంటూ;అభ్యంతరం చెప్పేదేగాదు.

పైగా–; సాంఘికాలూ—సాంసారికాలకూ, సంబంధించిన, నవలల్లోని శృంగారఘట్టాలు చదవమని సూర్యాన్నామె ప్రోత్సాహపరుస్తూండేది. ఈవిషయంలో ఆమెవుద్దేశ మేమిటో తెలీదు. కాని, సుభద్రమ్మకేవైన నీచపుటుద్దేశాలున్నాయని యెంతమాత్రం అనుకోరాదు.

సూర్యానికి ప్రతిదినమూ, తలదువ్వి వాలుజడవేసి, స్నానం చేయించి, యేరోజుకారోజు తెల్లటిపట్టుబట్టలు కట్టించి, ఆమె దివ్యమోహనవిగ్రహాన్ని చూచి యెంతో మురిసిపోతూండేది సుభద్రమ్మ. పసపూ బొట్టూలేని కారణాన్ని గమనించనివారికి ఈమెయొక్క వైధవ్యావస్థ కనబడేదేగాదు ఆమెనిలా ముస్తాబుచేసిన సుభద్రమ్మ, సూర్యాన్ని నందిట్లోకి తీసికుని, గాఢంగా ముద్దెట్టుకుంటూ—;

నాబంగారుబొమ్మా! నువ్వు మారంగడికి భార్యవైనావంటే; నా జన్మసార్థకమైపోనే సూర్యం; అంటూ తన కుమ్మెంచిన రొమ్ముమీదికి అదుముకుంటూ, పరవశమైపోయేది.

మేనత్త తనమీద చూపిస్తూన్న పామరత్వానికి తనివినొందుతూ, అప్పుడపుడామె, బావమైన రంగారావు పేరెత్తి చెబుతూండే చలోక్తి మాటలకు సిగ్గుపాలు కలసిన చిరునవ్వుతో సూర్యకాంతం, సుభద్రమ్మల

కైంతో ముచ్చటగా కనుపించేది. మానసికంగా యెంత మరుకైందో కాయికంగా, అంత సామర్థ్యంగలది సుభద్ర. కొడుకు నూరురూపాయిలు జీతగాడైనా, దాసీమనిషినైనా పెట్టక, పెంటపని దగ్గిరనుండి వంటపనిదాకా స్వయంగానే చేసుకునేది.

మేనత్త ఇలాకష్టపడుతూ సంసారపు చాకిరీఅంతా చేస్తూంటే; తాను ముస్తాబుదిద్దుకుంటూ కూచుని తినడానికి సిగ్గుపడుతూండే సూర్యకాంతం, యేదోవని సాయంచేదామని చూచేదికాని;

ఇక్కడిచెంబక్కడ పెట్టనిచ్చేదికాదు మేనగోడల్ని సుభద్రమ్మ.

వీరిద్దరూ తీరుబడిగా కూచుని గ్రంథకాలక్షేపం చేస్తూండగా వచ్చాడు రంగారావు ఆఫీసునుండి. సూర్యం చటుక్కునలేచి చాటుకు పారిపోబాగా—; ఆమెపైటచెంగు తొలిగించుకుని—;

'బావేకమా! పారిపోతావేం? అని సుభద్రమ్మ అనగా—;

'కొత్తగా నేర్చుకుంటూంది. సిగ్గుపడ్డం' అని రంగారావన్నాడు.

'తప్పమ్మా! నీబావేకమూ?' అంది మేనత్త.

'మీనాన్నకోసం బెంగెట్టుకున్నావా?'

'కాదు నవతల్లికోసం' అని రంగారావు అనగా—;

ఆపుకోలేక ఫకాలించి నవ్వింది సూర్యకాంతం. ఆనవ్వులోనున్న మాధుర్యాన్ని చవిచూచిన రంగారావులో అంతర్వాహిని యైయున్న పడుచురక్తం పొంగి పొరలినట్లైంది. 'సూర్యం మాయిల్లు బావుందా? అన్నాడు రంగారావుతిర్గి

'మనిల్లనకూడదటూ; అవరు నేవిటికి?'

'కామామరికి జోగన్నశాస్త్రిగారి కూతురు.'

'రంగారావుగారి మేనమామ కూతురే;'

'ఔనా సూర్యం?'

'ఔననుతల్లీ, సిగ్గుపడక;'

తల్లికొడుకుల యీచెలోక్తిమాటలు వింటూ, మేనత్తచాటున

అలాగేనిలబడి పోయింది. తానుకూడ వారిప్రస్తావనలో పాలుపంచు కుని, జబాబుచెప్పడానికి తగిన సమర్ధత వుందిగాని—; బావకెదురుపడి జవాబుచెప్పడానికి కావలసినధైర్యం కలిగింది గాదింకాను.

రంగారావు బట్టలుతీసేసి, స్నానంచేసి వచ్చాడు. సుభద్రమ్మ కొడుక్కి వడ్డనచేదామని మడికట్టుకుని—;

'రానాయనా; అన్నం తిందూగానీ; అని పిలిచింది.

'నాకాకల్లేదమ్మా యివాళ.'

'అదేంరా! ఆకలెందుకులేదూ?'

'చెప్పనా?'

'చెప్పు;'

'నాకివాళ సూర్యం వడ్డించాలి; లేకపోతే—;

'నాసరసను భోజనానికూర్చుంటే నువ్వు వడ్డించాలి.'

'గొప్పకోరికే; అడసలే సిగ్గుపడుతూంటే;—'

'లేకపోతే నాకాకల్లేదు.'

'వింటూన్నావటే సూర్యం;!

'సూర్యకాంతం సిగ్గుదొంతర్లమీద దొర్లుతూన్న చిర్నవ్వుముఖంతో' సరసను కూచోలేను భోజనానికి అని మేనత్త చెవిలో నెమ్మదిగాఅంది పోనీ లేతల్లీ! వడ్డనచెయ్యి. అంది సుభద్రమ్మ అనడంతో.

---

౮

'కమలానికి గర్భాదానం చేదామండి' అని బంగారమ్మ అనగా-;

'తొందరేం?' అన్నాడు జోగన్నశాస్త్రి.

'అలాంటారే? ఇంకా సమర్తాడలేదన్న మాటేగాని; చూడండి దాని అవయవాలు;'

'తేపగా యెదిగింది.'

'పద్నాలుగోయేడు కూడావచ్చింది. రేపోమాపో వ్యక్తురాలు

కూడ ఔతుంది.'

'అయింతర్వాత;'

అలాక్కాదండి, సమర్తాడిన నక్షత్రం మంచిది కాకపోతే, శాంతీ గింతీయనీ, సంవత్సరమో ఆరుమాసాలో వల్లకాదంటారు.

'పోనీ మంచినక్షత్రినా దే—;'

'మనవశమా? ధనిష్టాపంచకాలుకూడా వస్తున్నాయి. ఎందుకైనామంచిదే

'సుబ్బారావుకు సుస్తీగావుంటె ఔషధం పుచ్చుకుంటున్నాట్టకదూ; వాళ్ళతండ్రి వుత్తరం రాశాడు.'

'ఔను; పాడుతిరుగుళ్ళుతిరిగి యేమితెచ్చుకున్నాడో; ఆలస్యంచేస్తే-'

'కొంచెం నయమన్నా కావాలా?'

'అదేంజబ్బో మీరోసారి పోలవరం వెళ్ళివస్తే బావుంటుందికదూ?'

'నిజమేగాని, గోదావరి పొర్లిపారుతూవుంది. పడవలూ, లాంచీలూ, నడవడం లేదట;'

'ఉత్తరం వెళుతుందా?'

'దానికే-? యెగిరి చక్కాపోతుంది.'

'అలాగైతే వోవుత్తరంరాసి పడేయండి అబ్బాయికి చులాగ్గ నుంటే శ్రావణమాసంలోనె ఔపోసనకార్యం జరుపుతామని;'

'ముందుగానే అలా రాయడమెందుకు?' 'ఏంజబ్బు; యెలాగుంది; నయమయిందా? అనిరాస్తే బావుందిగాని;'

'పోనీ అలాగే రాయండి;' అంది బంగారమ్మ.

'రాజమండ్రికూడా వోవుత్తరం రాయాలి.'

'ఎందుకు?'

'సూర్యం క్షేమం యీమధ్య తెలీడంలే;'

'ఆఁ వాఁ? ముద్దులకూతుర్నివడూ యెత్తుకుపోళ్ళేంది; మీకంత బెంగెందుకు?'

'ఏంమాట బంగారం అది?'

'శుభం వలకరాముంకెన్నా! అంటే—;'

'పెళ్ళికూతురు ముండేదిరా వెంకన్నా?'

'అన్నట్టు అల్లుడిక్షేమాన్ని గురించి నేనుపోలవరంవుత్తరంరాయ మంటే; అపశకునంలాగ, అసాఉముండా మాటెత్తు కుంటారెందుకు?'

'శ్రీహరీ! అని చెవులుమూసు కున్నాడు జోగన్నశాస్త్రి'

ఇంతలో పోష్టుజవానువచ్చి, వచ్చేకవరోదాన్ని శాస్త్రిగారి కందించి రశీదుమీద వంతకం తీసుకువెళ్ళిపోయాడు,

ఆటెలిగ్రాం ఇంగ్లీషులోవుంది. అందులో యేముందో, అని చదివించుకోడానికి మాస్టరుగారి దగ్గిరకు వరుగెత్తాడు జోగన్నశాస్త్రి. బడిపంతులది చదివి, ఇలాఅర్థం చెప్పాడు.

మీయల్లుడు సుబ్బారావుకు జబ్బు ప్రమాదకరంగా నుంది. వెంటనే రావలెను.

సోమయాజులు, పోలవరం.

సంగతివింటూనే జోగన్నశాస్త్రి నిలువునా కుళ్ళికూలిపోయాడు ఈదారుణవార్తను తననోటితో యెలాచెప్తాడు పెళ్ళానికి;

ఏమీ తోచిందిగాదు. ఆడదాన్లాగ బావురుమని యేడుస్తూ కూచున్న శాస్త్రిని వోదార్చి; బడిపంతులు, సంగతియావత్తు గ్రహించి ఆకాయితంమీదే,దానియర్థం తెలుగులో వ్రాసి,వోకుర్రాడిచేత శాస్త్రిగారి భార్యకిచ్చి రమ్మని పంపాడు. కుర్రాడు కాయితం పట్టుకు వెళ్ళేప్పటికి బంగారమ్మ, కూతురికి జడల్లుతూ కూచుంది. న్యాలు కుర్రాడిచ్చిన కాయితం అందిపుచ్చుకుని, చదవమని కమలాని కిచ్చింది.

తనరెండోతరగతి పాండిత్యంతో, గుడింతాలుకూడబలుక్కుని వోమాదిరిగా ఈడ్చేసిందా నాలుగుముక్కల్లో కొన్నిఅక్షరాలు దిగమింగి;

అసలుసంగతి అర్థమైంది బంగారమ్మకు; ఇంకేముంది?

ఇల్లెగిరిపోయాలాగ పెడబొబ్బలు పెడుతూ నెత్తిమోదుకుని యేడవసాగింది బంగారమ్మ;

ఆకాయితంలోని సంగతేంగాకుండా, తల్లియొక్క యీఅకాల రోదనానికూడ అర్థం తెలీని కమలావతి, కళ్ళు విప్పుకుని బేలగా తల్లికేసి చూడసాగింది.

ఇరుగుపొరుగు అమ్మలక్కలందరూ పోగయ్యారు.

'కూతురో-నీకెంత రాతొచ్చిందే;' అంటూ బంగారమ్మ యేడిచే యేడుపుకు అర్థం తెలీక అందరూ డిల్లపోయి చూడసాగేరు. కూతురికేం;

బెల్లంగొట్టిన రాయిలా కూచునుంది యెదురుగా

అంతలో చక్కావచ్చాడు జోగన్నశాస్త్రి కాళ్ళీడ్చుకుంటూ..

ఆమె యేడుపులో తండ్రికూడ శృతికలిపి రోదనం అందుకోడంతో, తానూరకుంటే బావుండదనే, యేమో;

కమలావతికూడ అందుకుంది; వారిద్దరికీ సమానస్థాయిలో;

చూడవచ్చిన వాళ్ళందరికీ; అర్థమైంది. అల్లుడికి జబ్బుగానుందని;

జబ్బుగా నున్నంతలోనె యింతగోలా? అని కొందరనుకుంటే—;

అబ్బే; అంతా అయిపోయే వుంటుంది. టెలిగ్రాములో అలా రాశారుకాని; అని కొందరన్నారు.

ఏమోగాని పిల్లముఖం యెప్పుడూ పీడకళతోనే వుండేది—; అని పొరుగు పోలమ్మ అంటే—;

'ఔనే నాతల్లీ! పునిస్త్రీకళే వుండేదిగాదు కమలమ్మ మొఖంలో;' అని పొరుగు పోలమ్మ అంది.

సవతికూతురి కాయవస్థవచ్చిందని వోనాడైనా పశ్చాత్తాపమైనా చూపించిందా? భగవంతుడు పాలించడూ? తనకూతురికే దాపరించిందా రాత;' అనుకున్నా రందరూనూ.

జోగన్నశాస్త్రికికూడ అనుమానంగానెవుంది; యెడమకన్ను దురుతూంది. ప్రయాణానికి బట్టాపాతా సద్దుకుంటూంటే యెవరో తుమ్మినట్టు వినిపించింది.

జబ్బుగానుందని దాంట్లోవుందేగాని, యేదో జరగబట్టే టెలిగ్రాం

యిచ్చారు. ఏదో జరిగిపోయే వుంటుంది. అనుకుంటూ ప్రయాణం కట్టాడు శాస్త్రి పోలవరానికి.

———

౯

సూర్యాకాంతానికి మెళ్ళోనాలుగు పేటలగోవర్ధన గొలుసూ, చెవులకు కమలాలు, చేతులకు రెండుజతల బంగారపు గాజులూవున్నాయి

ఈస్వల్ప నగలతోనె వుండడం సుభద్రమ్మకంత తృప్తిగా నుండకపోయినందున కాబోయే కోడలి యలంకారాల నిమిత్తం తయారు చేయించి యుంచిన గజ్జెలవడ్డాణమూ, కంఠి, కాసులపేరు, దవురుగళ్లీ, దండవంకీ, కూడ సూర్యాకాంతానికి నిత్యమూ, వద్దువద్దంటూన్నా కూడా బలవంతాన అలంకరించి, ఆనందిస్తూండేది. తనవైథవ్యావస్థను పూర్తిగా తెలుసుకునేటంతటియీడు వచ్చిన సూర్యకాంతానికీ యలంకారాలన్నీ వెగటుగానేగాక, అసహ్యాంగా కూడాకనిపించేవి

కాని—; ముచ్చట పడుతూన్న మేనత్తమాట తీసెయ్యలేక, తనకిష్టంలేక పోయినా, మేనత్తముద్దుచెల్లించకపోతే యేమనుకుంటుందో; అన్న భయంతో, విధిలేక అంగీకరించేది.

సూర్యకాంతాని కోనాడు తలదువ్వుతూ సుభద్రమ్మ—;

పురాణాల్లో వర్ణించినట్టు. అచ్చంగా, చమరీవాలమే నీతలకట్టు; నిగనిగలాడుతూ నొక్కునొక్కులుగల యింతపొడవు తలకట్టున్నందుకు నీజడయెంత బావుందనుకున్నావు; ఈజడలో—;

నాలుగు సన్నజాజి మొగ్గలుగనక తురిమితే; వేరేఅడగాలానాబిడ్డా;

గంధర్వకాంత—అప్సరస—రతీదేవి; యెంతోఅందంగా వుంటారని పురాణకర్తలుపొగిడారు. వాళ్లెవరైనా నిన్నోసారిచూచారంటే డంగైపోరూ?

యేమిచక్కదనమే—యేమందమే నాబంగారుకొండా;

అంటూ చెక్కిళ్లు ముద్దాడింది. సుభద్రమ్మ. ఉత్సాహముండే

వుత్సాహం యీయలంకారాలన్నీ ధరించుకున్నప్పుడుండే దేగాదు సూర్యకాంతానికి. వేదో తప్పుచేసిన దాన్లాగ పైవాళ్లకేగాదు, యేనత్తకంట బడ్డానికూడా సంకోచపడుతూనె వుండేది.

ఇక రంగారావు విషయంలో—;

సాధారణంగా అతనికళ్ళపడ్డానికి ప్రయత్న పూర్వకమైన తొలుగు చేసేదికాదు గాని; ఈవస్తువులన్నింటిని పెట్టుకుని ముస్తాబైనపుడు బావ కళ్లల్లో యెక్కడపడతానో యని బహుజాగ్రతగా తప్పుకు తిరగడానికి ప్రయత్నించేది. అసలామెకు తలదువ్వుకుందామన్న ఆసక్తికూడా వుండేదిగాదు; మేనత్తయొక్క శ్రద్ధయే ఆమెనిలా ముస్తాబు చేస్తూండేది.

రంగారావు ఆఫీసునుండి సాయంకాలం యింటికి వచ్చి—;

'సూర్యం!' అంటూ పిలిచాడు.

'ఏంబావా;' అంటూ తలుపుచాటునుండే సమాధానం చెప్పగా;

'ఇలారా;'

రాలేదు. అందుకు కారణం కనిపెట్టి

'అమ్మా! సూర్యానికి ముస్తాబుగాని చేశావాయేమిటి?'

అనగా—; యేంనాయనా!' అంటూ యెదురుగావచ్చింది తల్లి.

'యేమీ లేదమ్మా! సూర్యం యివాళ తొలుగుచేస్తూంటే నువ్వు ముస్తాబుగానీ చేశావేమోనని—;

'ఆహాం! కనిపెట్టావూ?' వుండు పిలుస్తా.

'వోసేవ్! సూర్యం! సూర్యం! అనిపిలిచింది.

జవాబు రాలేదుగా.

ఉండరారంగా నేవెళ్ళి తీసుకొస్తా;'

అంటూ గదిలోకివెళ్ళి సిగ్గుతో మూలకొదిగియున్న సూర్యకాంతాన్ని చెయిపట్టుకు తీసుకవచ్చి కొడుకుయెదుట నిలబెట్టింది.

తెల్లవాయిలు చీరకట్టుకుని, కెంబోసిల్కు జాకెట్టు తొడుక్కుని వెనకాల పిరుదులుదాటిన వాల్జడా, ముందుతళతళలా మెరిసే ఆభరణాలూ

సమయమున గజ్జెలవడ్డాణమూ ధరించుకొన్న సూర్యాన్ని చూచి—;

ఈమెలో వెధవరిక యెక్కడుంది? సర్వమంగళదేవీ స్వరూపం వెల్లి విరుస్తూన్న ఈనవమోహనాంగిని బాలవితంతువనగలా? అనుకుని-;

'సూర్యం! ఇవ్వాళ సినీమాకు వెళదామా?'

వస్తానన్నట్టు తలయూపింది. సూర్యం.

'ఏం సినీమా నాయనా యివాళ?'

'మళ్ళీపెళ్ళట' అనిరంగారావనేసరికి;

'మళ్ళీపెళ్ళి?' బాగుందిపేరు. అని గతుక్కుమంది సూర్య.

'రెండోపెళ్ళి అనన్నా అనక, మళ్ళీపెళ్ళేవిటా?' 'వాళ్ళశ్రాద్ధం? తురకతెనుగులాగ?' అంది సుభద్రమ్మ.

'పేరులో యేముంది; కధబావుండాలిగాని?' అని రంగారావంటే-;

'ఔనంతే;' అంది సూర్యం.

పెందలాడే భోజనాలుచేశారు. ఆనాడు సుభద్రమ్మ మేనకోడలికి స్పెషలు ముస్తాబుచేసింది. ముఖాన్ని బొట్టుందో లేదో; యెవరు పరిశీలనగా చూస్తారు? ఈకాలపు నవనాగరిక మహిళామణులకిదో ఫాషన్గా, ఆకాశంలో అరుంధతి చుక్కలాగ అంటీఅంటని బొట్టుపెట్టుకోబడే యీరోజుల్లో, సూర్యకాంతం విధవో—సధవో—; అని పరిశీలనగా ఆనవాలుకట్టడాని కెవడబ్బతరం? రిజర్వ్డు సీటులో రంగారావుప్రక్కను కూచున్న సూర్యాకాంతాన్ని చూచినవాళ్ళంతా, అతనిపెళ్ళామై యుంటుందని అనుకునేవారు. సినీమా ఆటకంటే; రతీమన్మధుల్లాగ కుదిరిన యీజోడానే చూచేవారాశ్చర్యంగా కొందరు

---

౧౦

సవతికూతురు ముండమోసిందని కడుపులో కావలసినంత ఆనందపడుతూండే బంగారమ్మకు కావలసినంత గర్వభంగమూ చేశాడా భగవంతుడు; అనట్టు—;

ఆరాత తనగారాలకూతురికే దాపరించేప్పటికి ఉడుకుబోత్తనం యెక్కువైనందున—; అసలేకోతి—; పైగా కల్లుదాగింది;

అన్నట్టు మొదట్లోనె గయ్యాళి—; ఆపైన ఉడుకుబోత్తనం కలిసేప్పటికి బంగారమ్మ ఆగడానికి పట్టపగ్గాలేకపోయినై.

చీటికీమాటికీ, కాట్లకుక్కలాగ పెద్దనోరు చేసుకుని, మొగణ్ణి యిరవైనాలుగ్గంటలూ, ఆడిపోస్తూండేది బంగారమ్మ.

ఇంట్లోపోరు ఈశ్వరుడైనా భరించలేడంటారు; అలాంటప్పుడు—;

అసలే అమాయకుడైన జోగన్నశాస్త్రి, తనకింటాబైటా కెడాపెడా తగులుతూన్న దెబ్బలకె, తాళుకోలేక సగంచచ్చియున్న వాడట, ఈగయ్యాళిగంప సాధింపుకు మనోవిచారం పెట్టుకుని మంచంయెక్కాడు.

తనముద్దులకూతురు నెత్తికి చేడరాసిన అల్లుడికంటె యెక్కువా? నానుగాను [illegible] భావంతోనున్న బంగారమ్మ శాస్త్రికి తనవైద్యం చెయించటానికి ప్రయత్నించనే లేదు సరిగదా?

కావలసినప్పుడు కసిన్ని వేన్నీళ్ళైనా కాచి యిచ్చేదికాదు.

జోగన్నశాస్త్రి తనకుదానే ప్రయత్నించి, స్నేహితుడైన పూజారి లింగయ్యవద్ద మందుపుచ్చుకునేవాడు గాని—; మందులతోవ మందులదే; రోగంతోవ రోగానిదే; లింగయ్య ఘనవైద్యుడే గాని—;

మనోవ్యాధికి మందులేదు.' అనేమాట ఉత్తినే పుట్టలేదు

ఈకష్టకాలంలో తనకూతురైన సూర్యకాంతం గనకవుంటే; శాస్త్రి ఆదరణగా చూడగలదని అనుకునేవాడుగాని—;

మేనత్త యాదరణలో హాయిగా బతుకుతూన్న ఆపిల్లను యీరాకాసియెదుటి కెందుకురప్పించాలని—; మృత్యుదేవతా దర్శనానికై యెంతో ఆతురతగా కనిపెట్టుకూచున్నాడు జోగన్నశాస్త్రి.

అందుకుముందు జాగ్రతలన్నీ సిద్ధపరుచుకునే వున్నాడు.

మొదటినుండీ తనపెళ్ళాంయొక్క దుస్వభావమంతా యెరిగియున్నశాస్త్రి, కరణంగారితో ఆలోచించి, తనయావదాస్తికీ వీల్నామా

రాయించి, రాజమండ్రిలో రిజిస్టరుకూడా చేయించే యున్నాడు.

ఆమరణ శాసనంలో ముఖ్యమైన వాంశం యేమంటే—;

తనఅనంతరాన్ని తన యావదాస్థీ తనకూతుళ్ళయిన సూర్యకాంతం—కమలావతిగార్లకు సమానంగా చెందాలని;

తలచెడి యింటబడియున్న తనకూతురైన కమలావతి తాలూకు వాటాతో తానుకూడ జీవిస్తుందన్న యూహతో కాబోలు పెళ్ళాంసంగతి యెత్తుకోనే లేదు. క్రమంగా చమురుతగ్గి పోయినదీపంలాగ. జోగన్న శాస్త్రి మాగన్నుపెట్టి మళ్ళీ తెరవలేదు.

ఆఖరుఘడియలో ఖబురందిన రంగారావు తల్లినీ సూర్యకాంతాన్నీ తీసుకొని గోకవరం వచ్చేప్పటికి, అన్నీ అయిపోయాయి. సూర్యకాంతానికి తండ్రిశవాన్ని చూడ్డానికి ప్రాప్తిలేకుండా దహనకాండకూడ ముగిసిపోయింది. శాస్త్రికి మగసంతానంతోపాటు జ్ఞాతులుకూడ లేనందున మేనల్లుడైన రంగారావే, మిగతకర్మకాండంతా కానిచ్చేశాడు.

ముసలిగంత తండ్రివుండగానే, నానాతిప్పలూ పెట్టిన సవ తల్లి, ఇప్పుడు సాగా యాదరిస్తుందా; అని, బంగారమ్మ కోరినాగాని, సూర్యకాంతాన్ని గోకవరంలో వుంచడాని కిష్టపడక. రాజమండ్రి తీసుకెళ్ళిందసుభ దమ్మ

ఏమనుచేతనో తనకు తెలీదుగాని; బావను వదలి, దూరంగానుండడం తన కెంతమాత్రం యిష్టంలేదనే ప్రేమభావంకూడ యేర్పడింది రంగారావుమీద సూర్యకాంతానికి

'స్వయంరాజా—స్వయంమంత్రీ!'

అన్నట్టుగా, బంగారమ్మకు మగని యావదాస్థిమీదా కావలసినంత యధికారమూ—స్వేచ్ఛా—అబ్బినందున ముసలిమగణ్ణీ సరేసరి;

ఒళ్ళుక్కూడ మరిచిపోయి, కూతురితోబాటు తానుకూడ అలంకరించుకుంటూ, కులాసాగా గడపసాగింది బంగారమ్మ.

గాడిదపిల్ల వుట్టినపుడెంతో అందంగా కనిపించినట్టు—; వయసు వచ్చిన ఆడదానికి వంకరకాళ్ళయినా, తిన్నగానె కనిపిస్తాయి.' అన్నట్టు;

అసలందగత్తె కాకపోయినా, సమర్తాడినతర్వాత నాలుగవయువాలూ పాటకరించేప్పటికి నవనవలాడుతూ కనిపించసాగింది కమలావతి

ప్రౌఢవయసులోవున్న బంగారమ్మ మగనిచాటు స్వేచ్ఛావృత్తి యొంతరహస్యంగా సాగించుకున్నా గాని, గ్రామం అందరికళ్ళల్లోనూ, లోకువగా కనిపించిన బంగారమ్మ కూతుర్ని హద్దుపద్దుల్లో నిలబెట్టుకో డానికి తగినంత సామర్థ్యం లేకుండైంది.

తల్లియావు చేనిలో మేస్తుంటే—; దూడ గట్టున మేస్తుందా?

కొన్నాళ్ళదాకా తల్లిచాటునపిల్లా, పిల్లచాటునతల్లీ, పిల్లిమొగ్గలు వేసేవారుగాని—; క్రమంగా, తలుపువేయని తంజావూరు సత్రమై పోయింది జోగన్నశాస్త్రి కొంప.

---

౧౧

'సూర్యం! బావకు తాంబూలం ఇచ్చిరా;'

'అమ్మయ్యో! నాకు సిగ్గూ;'

'సిబావే కాదటే? పైవాడా యేమన్నానా?'

'ఏమో, నాకుసిగ్గు'

'భయంలేదుపద; నేనూవస్తా;' అంటూ సుభద్రమ్మ తాంబూలం పళ్ళెం చేతికిచ్చేప్పటికి మారుమాటాళ్ళేక ఆపళ్ళెంచేత్తో పట్టుకుని—

సన్ననికందిరీగ నడుంమీద యాతాంపెట్టగా ఉన్నతివక్షోభారం ఊగిసలాడుతూండగా, తక్కుతూ తారుతూ, రంగారావు కూచున్న పడక్కుర్చీ వెనకాల నిలబడింది. సూర్యకాంతం చిరునవ్వు సిగ్గుమొఖంతో పళ్ళెంలోని లవంగమొగ్గల్ని యిటూఅటూ తోస్తూ.

'ఆదేంసూర్యం? అలానిలబడ్డావు;' అని తలుపుదగ్గిరకువచ్చి సుభద్రమ్మ గారమ్మ అనేటప్పటికి తృళ్ళిపడి చూచాడు రంగారావు.

సూర్యకాంతం అతనిముందరగా వెళ్ళింది.

'అదేవిటి; ఫలహారమా?' అన్నాడు రంగారావు.

'కాదు' అంది సూర్యం వోరగాచూస్తూ.

'మరేమిటి?'

జవాబు చెప్పకుండగనే కర్చీ చేతిమీద పెట్టిందాపళ్ళెం.

తలుపుచాటురుండి తొంగిచూస్తూన్న మేనత్త—;

'అదేమే; సున్నుంరాసియ్యి రొంత.' అనగా—;

తనలజ్జావస్థను మూడోమనిషికూడ చూస్తూన్నందుకు మరింత సిగ్గుపడుతూ, 'పానకంలో పుడకలాగు నువ్వెందుకిక్కడ? ఆవలకుపో;'

అన్నట్టుగా చురచురా చూచింది సూర్యం;

ఆచూపులోని యంతరార్థం కనిపెట్టిన సుభద్రమ్మ చటుక్కున వంటింటివైపుకు వెళ్ళిపోయింది.

'సూర్యకాంతం వొకఆకు సున్నంరాసి యీనెలూడతీసి కర్చీ చేతిమీద పెట్టగా—;'

'ఆ!' అంటూ నోరుతెరచాటు నోటికందియ వలిసిందన్నట్టుగా;

'వేలు కరవడానికా?' అని సూర్యం అనగా—;

'తప్పకుండాను; జ్ఞాపకం చేశావు.' అన్నాడు—;

'అమ్మయ్యో!'

'కరినన్లే; భయపడకు.'

వొక్కక్కఆకూ. నోటికందిస్తూంటే; మంకెన పూరేకులవంటి ఆమె లేతవేళ్ళను యెలాగైనా నోటితో అందుకొందామని ప్రయత్నించేవాడుగాని, అతనియభిలాష నెరిగినసూర్యం రంగారావు పెదవులకు తన చేతివేళ్లనందకుండా వుండడానికి ప్రయత్నపూర్వకంగా తప్పించుకునేది.

అంతటితో వూరుకోలేదు రంగారావు. ఇంకోఆకు నోటికందియబోయేసరికి చటుక్కున ఆమెచేతిని తనచేత్తో పట్టుకోగా; గతుక్కుమని కంగారుపడిపోయింది. సిగ్గుతో శరీరం కపించి పోయిన సూర్యకాంతం.

'పదులు బావా;' అని సూర్యం మృదువుగా విదిలించబోగా;

'నేవదలను'

'అమ్మయ్యో! అత్తవస్తుంది.'

'రానీ?'

'మీకేం?'

'నీకు మాత్రమో?'

'తప్పకమా?'

'నేనేం చేశానని?'

'అబ్బ వదలండి.'

'వదుల్తాను పారిపోక అలాకూచుంటావా మరి?'

'ఆఁ;'

రంగారావుఆమెచెయివదిలిపెట్టగా; యెదుటనున్నకుర్చీకిఆనుకునినిలబడగా 'అలాకాదు కూచో;' అన్నాడు. కుర్చీలో తలవాల్చుకుని కూచుంది.

'అదేఁ; పెళ్ళికూతుర్లాగ-;'

పకపకానవ్వింది సూర్యకాంతం.

'రాత్రి సినీమా బావుందా?'

'ఆఁ;'

'ఆయమ్మాయికి మళ్ళీపెళ్ళిచేశారు. యెంతమంచిపని?'

'ఛా! విధవముండకా?'

'మగాడు పెళ్ళాంచస్తే మళ్ళీయెన్నిసార్లయినా పెళ్ళాడొచ్చు మీనాన్నలాగ?'

'నాన్న యేంసుఖపడ్డారు?'

'మీపిన్నిలాంటి గయ్యాళివానువ్వు?'

'నేను కాకపోతేనో?'

'పెళ్ళికొడుకు ధూర్తుడౌతాడా?'

'నాకెందుకా గొడవ?'

'మాటవరస కడిగాను,'

'నన్నడగడమెందుకు? పోతా;' అంటూ సూర్యం లేవబోగా-;

'పోనీలే కూచో;'

'అత్తయ్య పిలుస్తూంది. నేపోతా.' అంటూ వెళ్ళిపోయింది సూర్యం.

---

౧౨

మగదక్షితలేని బంగారమ్మ సంసారం, కొంగలుతొక్కిన మడుగులాగైపోయినవి. జోగన్నశాస్త్రి యేర్పాటుప్రకారం ఆయన మరణించినపిమ్మట సీలుకవరులో పెట్టబడ్డ శీల్నామాను పైకితీసి చూడగా, దానిలో రెండు కాపీలున్నాయి. వాటిని యాచిరునామాల ప్రకారం సూర్యకాంతానికి అందేట్టు రివిన్యూయినస్పెక్టరు రంగారావుకు రాజమండ్రికిని; రెండోప్రతి గోకవరంలోని కమలావతికిని, పంపేశాడురిజిస్ట్రారు

ఆపీలుకాయితం పట్టుకుని గబగబా కరణంగారి దగ్గిరకువెళ్ళి చదివించుకోగా—; 'మొత్తంఆస్థిలో సగంవంతు పెద్దభార్య కూతిరికి చెల్లవలిసిందే;' అన్నాడు కరణం పూర్తిగాచదివి.

'ఇంకేం సాధనంలేదా?'

'ఎందుకు?'

'దానికివాటా పెట్టక్కర్లేకుండా యీకాయితం దాచేస్తేనో?' అని బంగారమ్మ ఆశచూపగా—;

'అబ్బో! ఇదిరెండుప్రతులుగా వ్రాసి, ఆయామ్మాయి కోటి పంపాడు రిజిస్ట్రారు?'

'ఈరాత్రి మాయింటికోసారిరాండి, మీకు దయలేందేవా??

'ఎందుకు?'

'పనుంది.'

అని పైటసవరించుకుంటూ కళ్ళోకగాపెట్టి అనేప్పటికి, ఆమెయుద్దేశం గ్రహించిన కరణం 'అలాగేఅన్నాడు.' ఈపీడ వదుల్చుకుంటే చాల్నని.

బంగారమ్మ ఆపీల్నామా కాయితం పైటచాటునపెట్టుకుని తిరుగా యిల్లు చేరేప్పటికి వీత్తలుపు చేరవేసివుంది. లోపలకువెళ్ళి—;

'అమ్మాయీ!' 'కమలం?'

...    ...    ...

అంటూ బంగారమ్మ యిల్లంతాతిరిగి గాలించింది. కూతురుజాడ యెక్కడా లేదు. కొన్నిరోజులనుంచీ తనలో అనుమానిస్తున్నట్టుగానె జరిగిందేమొ; అనుకుని; కమలం పడుకునే గదిలోకి వెళ్ళింది. కూతురితాలూకు రెండుట్రింకు పెట్టెలుకూడా లేవు. దండెంమీద మాసినబట్టదగ్గిరనుండి ఆమెతాలూకు వస్తువులన్నీ మాయమయాయి. కావలసినంత దుఃఖం వచ్చింది బంగారమ్మకు, కాని గట్టిగాయేడిస్తే నలుగురూ వింటారేమొ?

ఆకారుమీదనుండే పోఖిరీ వెధవతో లేచిపోయింది.

ఉప్పెన పట్టుగా పొర్లుకొచ్చింది దుఃఖం; యేమనేదుస్తూంది బంగారమ్మ

తానింట్లో ముగ్గులెడుతూంటే; తనకూతురు వీధిలో ముగ్గలేయడానికి వెళ్లిండి. అంతేగమా యిద్దరికి తేడా; అని లోకులందరూ నవ్వి పోతారిని, వెధవముండా గర్భంలాగు తనలోతానే దిగమింగసాగింది.

సరిగా యీనమయానికే, కోర్టుఅమీనా సమనుకాయితం పట్టుకొచ్చి బంగారమ్మ కివ్వగా-; ఆసమను చేత్తోపట్టుకుని కరణంగారింటికెళ్లి చదివించుకోగా-; దానిలోని ముఖ్యసారాంశం యిలాచెప్పాడాయన

జోగన్నశాస్త్రిగారు వ్రాసిన వీల్నామాప్రకారం సగంవంతు ఆస్థికోసం ఆయనకూతురు సూర్యకాంతం పార్టీమనుసూటు దాఖలుచేసినట్టు చెప్పగా-! 'తక్కిన సగంవాటా, మాకమలాపతి పేర రాశారుగదా; అది చెల్లుతుందా?' అని బంగారమ్మ అనగా—;

'చెల్లకేం? భేషుగ్గా;' అన్నారు కరణంగారు.

'అదికాదండీ; అది-అది; నిన్న-లేచిపోయిందండీ,' అని కన్నీళ్లొత్తుకోగా;

'అలాగై తేచిక్కే; లేచిపోయిన వ్యభిచారికి హక్కుండదు.' అన్నాడాయన

దానివాటా నాకురామా?'

'రాదు'

'అమ్మయ్యో! మరిక్కరదాని వాటా యేమవుతుంది?'

'సూర్యాకాంతాని కేపోతుంది.'

'మరినా గతేమిటి?'

'సవతికూతురి నాశ్రయించుక బతకవలిసిందే; మర్యాదగా;'

'ఇంకేమీ తోవలేదా?'

'లేదు.'

కరణంగారు చెప్పినమాటలకు దిగాలుపడిపోయి బంగారమ్మ ఇంటికి చేరుకుని-; తనకూతురు లేచిపోయిన దానికంటె; సవతికూతురు భాగ్యవంతురాలై పోయిందని మరింత యేడువసాగింది.

---

౧3

'సూర్యం! ఈచీరలు చూచావు కే; అంటూ బనారసు చీరలో కొక్కొక్కటే తీసి చూపించసాగింది సుభద్రమ్మ.

'ఎవరివత్తాయివి?' అంది సూర్యం.

'బాన పెళ్ళికూతురికి'

'బాగున్నాయి.'

'ఈచీర ప్రధానంచీర; నూటయాభై రూపాయిల ఖరీదు.'

'చాలాబాగుంది.'

'వదీనాతల్లీ నువ్వోసారి కట్టుకో,'

'అబ్బే తప్పుకదూ?'

'అలాకాదే సూర్యం; కళ్ళవెలుగ్గా చూస్తానే; నీయందానికి కెంతో బావుంటుంది.'

'శుభమాంటూ, నేనుకట్టుకోడ మేమిటత్తా;'

'అలాకాదు-నన్ను చంపుకుతిన్నట్టు-నాతోడే; కట్టుకోవూ?'

'నువ్వలా పట్టుపడితే నేనేంచేస్తాను?'

'మరి కట్టుకో;'

స్నానంచేసి—;'

'మీ బావతోటేనా?'

'ఇంకెందుకువొట్టు? అన్నానుకదూ?' బంగారమ్మ పరమానంద భరితురాలై, సూర్యకాంతానికి తలదువ్వి, స్నానంచేయించి, తనపెట్టె లోని నగలన్నీ అలంకరించి, భరిణలోని సిలాయిబొట్టును నీళ్ళచుక్కతో రంగరించి బొట్టుపెట్టబోగా—;

'ఇదేమిటత్తా!' అంటూ సూర్యకాంతం అడుగు వెనక్కి వేసింది;

'పరవాలేదే; నేనుపెద్దదాన్ని తెలిదా? నీముఖంలోని స్త్రీకళ తాండవిస్తూంది. ఆకాస్తలోటూతీర్చి నన్నానందింప చేయవూ?'

అంటూ గడ్డంపట్టుక బతిమాలింది సుభద్రమ్మ.

సూర్యకాంతానిది మొగమాటపు మెత్తని మనసవడంచేత, మేనత్తచేసే అలంకారాలకు మారుమాటాడ్లేక పోయింది.

ఇదుగో యిలారా!' అని గోడనున్న నిలువుటద్దం దగ్గిరకుతీసు కెళ్ళి' చూచుకో నీయందం యిపుడెలావుందో,' అని సుభద్రమ్మఅంగా దగాలుపడ్డ మనస్సుతో తనరూపమా యద్దంలోచూచుకుంది సూర్యం

'పెళ్ళికూతురిలా వున్నావ్కదూ?'

'ఏమో; నాకు తెలీదు.'

అని కాంతం తలవాల్చేసుకుని వెనక్కి వెళ్ళిపోయి—

'ఈవేషం తీసెయ్యొచ్చా అత్తా;' అంది సూర్యం.

'అబ్బే! అలావుంచు. మీబావ చూడొద్దూ? వాడికళ్ళేం పాపం చేసుకున్నాయి?' అంటూ సుభద్రమ్మ ఆమెచెయి పట్టుకుని—

'వోరే; రంగా! యిలారా;' అని కొడుకును పిలవగా—;

'అత్తయ్యా నీకుదణ్ణంపెడతా. బావను పిలవకే;'

అంటూ చెంగు విదిలించుకోబోగా; అంతలో రంగారావక్కడకువచ్చి

'ఈపెళ్ళికూతు రెవరేఅమ్మా?' అన్నాడు.

నీపెళ్ళి...; అని అనబోగా; మేనత్తనోటికి తనచెయి అడ్డంగాపెట్టి-;

'ఉమ్!' అంది సూర్యకాంతం.

'నేను పెళ్ళాడ్డం తనకిష్టం లేదుగాబోల్నే అమ్మా' అని రంగారావనగా
'ఇలాచూడురంగా! నీమేనమామ కూతురికి పెళ్ళికళవచ్చిందిచూచావా'
'మేనమామకూతురు-మేన త్తకొడుకు, మేమిద్దరం వకేనోమునోచాం'
తన వేషానికితోడు తల్లీకుమాళ్ళ చిలోక్తి ప్రసంగాలు విన్నాకొద్దీ,
సూర్యకాంతానికి యెక్కళ్ళేనిసిగ్గూ నత్తికెక్కి, అక్కడనిలబళ్ళేక—;
'అబ్బపోదాంఅత్తా సిగ్గేస్తుంది నాకు.' అంది చిర్నగవుతో గుణుస్తూ
సిగ్గెందుకే; బావపైవాడా? అప్రయోజకుడా? అందవిహీనుడా;
ముసిలాడా? ఇలాచూడు సూర్యం; మేన త్తకొడుకు—పెద్దవుద్యోగం—
అందమైనవాడూ—నీకీడూజోడూను; ఇంకే.?
'నాకమ్మా-అబ్బా లేకపోబట్టి-; అనిసూర్యకాంతం వెక్కి వెక్కి యేడవగా
'అదేంసూర్యం! అందుకే నిన్నోయింటిదాన్ని చేదామని నాత
బంపు, నేనెల్లకాలం జీవించనుగదా; 'నా' అన్న వాళ్ళెవరున్నారు నీకు?
బావ పైపిల్లను పెళ్ళాడితే, నిన్ను మీసవ తల్లిలాగే తిప్పలుబెడుతుంది.
నీకింకాబతికదగ్గ కాలంబోలెడుంది; నీమేలుకోసమే నే;అనిసుభద్రమ్మఅన
స్తూర్యం గతుక్కుమని తృళ్ళిపడి—; 'ఔనుమరి; నాగతేం
గాను? బావకు పై పెళ్ళావస్తే—; నన్నావల క్కొడుతుంది;
అత్త చెప్పింది నిజమే, అనుకుని; కళ్ళు తుడుచుకుంటూ'
'అత్తా! నన్ను శాశ్వితంగా కడుపులోపెట్టుకోవూ?'
అంటూ సుభద్రమ్మను కావలించుకోగా—; ఆమె.
'నీకేంభయంలేదే నాచిట్టికూనా; ఇన్నాళ్ళనుంచీ చూస్తున్నావు
కదూ; బావ యెంతమంచివాడు?'
'ఇలారారా రంగా!' అని సుభద్రమ్మ పిలవగా—;
రంగారావు దగ్గిరకు వచ్చాడు. 'ఎదీ నీచెయి? అని కొడుకుచెయ్యి
పట్టుకొని రెండోచేత్తో సూర్యం చేతిని అతనికందించి—;
ఇదే మాతృదేవత పెట్టిన మంచిముహూర్తం. అంటూ వాళ్ళిద్దరిచేతు
లూ కలిపింది. ఆమె వేర్లిని మృదువుగా గిల్లేడు రంగారావు.

ఆమె విడిపించుకోడానికి సరసాంగా పెనగులాడింది.

'అమ్మా! చాటుమాటు వ్యాపారమెలాక్కుదురుతుంది? వీరేశలింగంగారి సమాజంలో యథావిధిగా పెళ్ళాడతాను, ఇంతకీ; సూర్యం అంగీకరిస్తేను. అని యతడనగా—;

'ఏమే సూర్యం;' అనతలవాల్చి వూరుకుందిసూర్యం.

'ఇహనేంరా! అదే అంగీకారం. నువ్వు అక్కడికోసారివెళ్ళి యేర్పాటులన్నీ చేసుకురా; అంది సుభద్రమ్మ, చెయి వదిలిపెట్టగానె చెంగున లేడిపిల్లిలా నూకి పారిపోయింది సూర్యం.

మాఘశుద్ధ పంచమినాడు, రాజమండ్రీలోని హితకారిణీ సమాజంలో బ్రాహ్మ్మమత విధానంగా రంగా— సూర్యకాంతంలకు సక్రమ వివాహం జరిగింది. పురపెద్దలు చాలమంది విందులారగించి; వధూవరులను ముత్యాలపల్లకీమీద బ్యాండు మేళంతో ఊరేగింపు జరిగించారు

వధూవరులు స్వగృహంలో ప్రవేశించిన తర్వాత;

బండిమీద బంగారమ్మవచ్చి సూర్యాన్ని కావలించుకొని యేడ్చింది. ఇద్దరూ వూరడిల్లాక;

'అమ్మా! చెల్లి అత్తారింటికెళ్ళిందా?' అని సూర్యం అనగా —;

గంగలోకి వెళ్ళింది. అని జరిగిన సంగతంతా చెప్పి ఇదుగోదాని, వాటాకూడా నువ్వే అనుభవించు తల్లీ! అని వీల్నామాను చేతికిచ్చింది.

'ఇంక నీకెవరున్నారు? ఇక్కడేవుండి పోవదినా;'.

అని సుభద్రమ్మ అనగా—; తనకూతురిలేగా.?

అన్నాడు నవ్వుతూ రంగారావు. తల్లిలేనిలోటు తీరిందని పొంగిపోయింది సూర్యం. బంగారమ్మ సిగ్గుపడిపోయింది.

—♦ సమాప్తం. ♦—

శ్రీ పాండురంగాప్రెస్, కస్పావీధి—రాజమండ్రి—800

